శ్రీరామ[illegible]॥

# నారదుఁడు

నారదుఁడు మన హిందూదేశమున విశేషఖ్యాతిఁ గాంచినవాఁడు. ఈతఁడు మహర్షి. మహాత్ముఁడు. వేదవేదాంగవిదుఁడు. విష్ణుభక్తుఁడు. మానసవ్యాపారధురంధరుఁడు. బ్రహ్మవిజ్ఞానసంపన్నుఁడు. సంగీతసాహిత్యపారగుఁడు మహనీయుఁడు. లోకసంచారకుఁడు.

పుట్టుకను బట్టి బుద్ధులు పట్టుబడుననునది సాధారణవాక్యము: కాని వీనిచరిత్రవలన మనకుఁ దెలియునది ఆహారము సహవాసము ఆశ్రమములను ననుసరించియే ఘనత కలుగు ననుట. పుట్టుకను బట్టి గుణము లేర్పడుట లేదు: బుద్ధుల ననుసరించియు నడతల ననుసరించియు నవి కలుగుచున్నవి.

"నారదో రజకపుత్రః" అను వాక్యము ననుసరించి నారదుఁడు చాకలివాని కొడుకు గాఁ బాడకట్టుచున్నాఁడు; కాని వీనియొక్క జీవితమున నెచ్చటను జాకలివానిగుణములు, అనీచసంభావనా లయహంభావత్వము అజ్ఞానశూన్యత అమోటుపాట అవంచకత్వము అనీరాహారవిహారవ్యవహారాదులు ఇంచుకంతయు లేవు.

ఇతనియొక్క మాత వేదాధ్యయనసంపన్నులగు బ్రాహ్మణులయింట దాసిగా నుండెడిది. ఆపెయు సౌభాగ్యురాలుగఁ గనుపట్టెడిని. భళిరా! పవఁ గలముత్తె మెక్కటి చాలుఁగదా కులమునకుఁ గులమువారందఱకును వన్నెఁ దెచ్చుటకు! ఒక్క సత్పురుషపుత్రుని సంభవమునఁ బూర్వాపరుల నైచ్యము వాయుటయే కాక కీర్తిగొప్పతనము గలవముగొనును! ఇందువలనే యుభయకులముల నుద్ధరించునట్టి పుత్త్రిపుత్త్రికులై సూర్యవంశ్యులుగాఁ

బహిరపించిరి; కాని నేఁటివఱకుఁ దరిద్రంపుంగ్రిల కడుపు చెడఁ బాడము కలగంపకూరవంటి గండ్రిలకుఁ గాదు. విషయసుఖాలోలత, భూమికి భరము గా, వన్నెఁజెడఁదీయు, జనించినవారికిఁబున్నామనరకోద్ధారక పుత్త్రీ పుత్త్రి నామంబులు చెల్ల నేరవు.

నాందునిజని మహాశాంతిగుణోపేతయయి యజమానులయందు భయభక్తులతో వినయవిధేయాతం వెలఁగుచుండెడిది. ఆత్మవంచన లేక కాయకష్టములు సరకుగొనక రాత్రింబవలు నాక నిజయజమాను భక్తితాత్పర్యములఁ సేవించుచు మానాభిమానములు పోనాక కుందునది. బ్రాహ్మణసేవాతత్పరత నామెకును సుగుణములు పట్టుపడుట యుక్తమా! ఆ త్తరు వంటిసవారియు సుగంధము గుబాళింప కాదునా!

విస్సుట నుండియుఁ దక్షిణను దర్శించు యజమానులకదను నుంగట నాదనునఁ బెంకెత

కేము మా రాము నల్లరిచిల్లరపనులు నవినీతము దొ
రకొనదమ్యా. పెద్దలయెడ భక్తి వారిమాటయందు
రక్తి వారియొక్క సేవయం దాసక్తి వారియొక్క
యుపదేశమున శక్తి నాటినది: అగును బుట్టువున నీ
చాతినీచ మయినను నగుక్రిమి సదా భ్రమరనినా
దశ్రవణమున భ్రమరము గా కుండునా! భ్రమర
కీటకన్యాయ మను సార్థోక్తి నారదునియట్లే బూర్తి
గా నొప్పినది.

సదా యజమానునిమాట జవదాటక యె
ల్లంగనినారదుని జిన్నతనమున నే యంతిదప్పున
మున్న వనమునఁ జాతుర్మాస్యదీక్ష వహించిన ము
నిచంద్రులపరిచర్యలకై వానియొక్క గుణములు నియో
గించిరి. ఆహా! యైన మెప్పు జేది యొనర్చినను
బునమేలునకే కదా! నారదుఁ డప్పటికి బాలుఁడు;
శకాలము వర్షాకాలము; అది అటవీప్రదేశము; స
న్నగునది దాస్యము; అయినను జంకుగొంకు అట

పాటుపరఁపవలెను లేక యాతఁ డాపనికిఁ బూనెను

గురుశుశ్రూష నేఁటిబడిపంతులఁ గొలుచున ట్టిది కాదు. అది శిష్యుని శమదమాదులు, నేర్పు, ఓర్పు, శాంతి, దాంతి ధైర్యస్థైర్యములు ఉచితా నుచితములు పూర్ణపరీక్షకుఁ దే నిర్ణయింపఁబడినది. కావుననే బ్రహ్మచర్యమునకే ఛాత్రులు సర్వజ్ఞు లగు చుండిరి: ఇహపరతారతమ్యముల నెఱిఁగియుం డిరి: కావుననే దానికి సార్థకబ్రహ్మచర్యనామము.

మానవుని మానసము స్వచ్ఛస్ఫటికమువంటి ది. అది నిర్మలమైనది. పరస్పరాకర్షణశక్తి గలది. అట్టి సర్వోత్కృష్టమైన తేజోరాశిని భగవం తుఁడు మానవాధీన మొనర్చి యున్నాఁడు. దాని నాదినుండి యంతముపర్యంతము నగ్గి నిలువరించు కొనుప్రజ్ఞ మర్త్యునిదే. అప్రజ్ఞ చాలమి భ్రమ ప్రమాదములు విషయాలోలత నరులు నిష్కళంక తేజోరాశిఁ గలంక మొనర్చుచున్నారు. బాల్యావ

గండ యౌవనకౌమారదశలఁ బట్టి దేశకాల వ్య
త్యాసములఁ బట్టి యాస్వైచ్ఛస్ఫటికము వివిధముఁ
జేయు చున్నారు. అట్టిపౌజపాటు అట్టిలోటుపాటు
అట్టిహైన్యదైన్యము అట్టిభవభవము అట్టిగానటబీ
వట తేకుంటకే యార్యవర్యులు చతురాశ్రమము
లు కల్పించినారు.

వానప్రస్థాశ్రమమున వాన, యెంప; వెలుపల
లోపల, నీరాహారము, ఉపవాసము; బట్ట, బొట్టు;
స్వపరతారతమ్యములు గణింపక యేకదీక్షను నా
రదుఁడు నాలుగుమాసములు వర్షాకాల శరత్కాల
ము లరుగుదనుక నాతపోధనుల సేవించెను. ఆమ
హానీయుల భక్త్యాన్న శేషమునే యారగింపుచుఁ ద
త్పదసేవయే భాగ్యమనుచుఁ దత్సంభాషణయే భా
వ్యమనుచుఁ బరిపాటిగా వారిబోధనలు మననము న
ర్చుచు అయిదేండ్లవాఁడయ్యు నారదుఁడు ఐహిక
వాంఛలకు దూరస్థుండయ్యెను లోకమున నన్నిం

టను జయింప సలవికానిది మనము: అట్టి మనస్సు ను జయించుటయే యింద్రియనిగ్రహము. జితేంద్రియత్వము పునర్జన్మరాహిత్యమార్గము: అట్టిది పిన్ననాఁటనే పట్టుబడిన నిఁక దాని గట్టితనము నుడువఁదరమా! అట్టివాఁడు చిరజీవికాఁడా! వానికి ముల్లోకముల నడ్డు గలదా! ఇచ్ఛామాత్రిష్టుఁడు, దివ్యచక్షుయుతుఁడు, కామసంచారుఁడు. సర్వము తాను తానే సర్వము, సర్వమయుఁడు

ఆత్మ సన్యాసికి అన్నియు నొక్కటియే. ద్వంద్వములు లేవు భేదబుద్ధి సున్న. విజ్ఞానము మిన్న. కావున పసివాఁడయ్యు నారదుఁడు ఎంగిలి పవ్యాము, దాస్యము, దౌష్ట్యము అనుకొనక సర్వథా పొంగుచు వానప్రస్థుల సేవించి వానప్రస్థాశ్రమమును జవిచూచెను. ఇట్లే యుపచారము విచారములు లేక యుపచరించు చున్నవారదు ననుగ్రహించి యాబుఃఖులను శ్రీమన్నారాయణనామక

థాసంకీర్తనమున వానికోర్కెములు పూరించిరి. ఈ భంభారధ్వనియే మొదట నాటి వానిని ఉన్మత్తుఁ జేసినది. ఆహా! తొలుతఁ గనులు మిఱుమిట్లు గొలుపుచంచలలతలఁ జెవులు చిందఱవందఱ గావించు ఘనగర్జల దేహము నఖశిఖపర్యంతము నానించు కుంభపాతముల నవావయవములు కొట్టుబారించు కడి ఘోషలఁ బ్రాణవాయువుల నెగురఁ గొట్టించునశనిపాతముల నెంతయో పఱపుట ఘనుఁడు భూమి సారవంతముగఁ జేసి కుజనత్వము తొలఁగించి పాడిపంటల సాగించి యాయురారోగ్యాభివృద్ధి గావించి యుపకృతి మనుపుటకే కాని యపకృతికిఁ గాదు కదా! కావుననే బ్రహ్మచర్యాశ్రమమున గురువులు శిష్యులఁ బరీక్షించుటలు.

ఇట్లు గురుశిక్ష వడసి శ్రీవిష్ణునామచింతనమునుగుఱు త్రైలోగి తన్నిష్ఠాగరిష్ఠుఁడై తాపత్రయదూరగుఁడై నారదుఁడు తిరుగఁ దనతల్లి కొలుచు బ్రా

హ్మణయజమానులఁ జేరియు మౌనియై రాగబంధ
ములఁ దెగఁగోసి సంచరించుచుండె.

ఓరా! అలసితి ననక యాఁకలిదప్పులనక
అర్ద్ధమరేయి పొద్దు చాలదనక మిట్టపల్లములనక
యెండ కొండయనక దూరభార మనక-ఆహా!
మాతృప్రేమ నెంతని వ్రాయఁగలను-నారదునితల్లి
వానప్రస్థులఁ గొలుచుచున్నఁ దనచిన్నారిసుతుని
వియోగమునఁ గనుపుండఁ బట్టి వీలయినప్పుడెల్ల
సందు చిక్కినప్పుడు సయితము యజమానులయాజ్ఞ
గైకొని యుత్సాహమున లేగకై పరుగిడు ఆవుఁ
బోలె యరణ్యమునకు వచ్చి, చెక్కిలి నిమిరి, చు
బుకము చుంబించి పాలనొసఁగి నిలువయుంచిన పదా
ర్థములు తినిపించి మాటిమాటికి ముద్దులిడి చుంచు
నాస్వై మేను నిమిరి యవయవములు స్పృశించి ఆ
క్కునఁ జేర్చి ఆనందోద్గమధురబాష్పములు పుచ్చి చి
లుకపలుకు లాలించి లాలించి నాలాయము పచార

శీతలతుషారవారిపూరనయనములఁ బోవుచుండెడిది.

ఆపై ద్వైవార్ధఁ గాలవశత నొకనాఁడు నిశీథమున వాలపాలఁ బితుక భూదేవార్జఁ జనుచు మిన్ను మన్ను తెన్ను కనరాని గాఢాంధకారమున నల్లత్రాచు నడఁగఁ ద్రొక్కెను. అంత నాసర్పము నిలువున నెగిరి యాపెఁ గఱచెను. కాలానలజ్వాలకరాళదంష్ట్రాగళితఘూలకము ఒకలాట నెగయ నాయమ యందుననే మూలచ్ఛేదనమ్మొందినయనఁటిఁ బోలి నేలఁ గూలి ధారుణికి దూరమగు దారుణమరణము నొందెను.

అనంతరము క్రమముగ నారదుండు న్వాదవనీమరణోదంత మెఱింగి యొఱుక కలవాఁ డగుటవది తనయంతరంగము నలమ కూడ శ్రీకృష్ణధ్యానపరాయణుఁడై తల్లికి నుత్తరక్రియ లాచరించి యుత్తరాభిముఖుఁడై వెఱ్ఱివానిఁ బోలి యాడుచుఁ బాడుచు భూతలముఁ దట్టుచుఁ జేతులు కొట్టుచు వ

డవెడ నగుచుఁ గడుఁగడు వగచుచు వింతగా వంత సించుచు నెంతో గంతుచు మౌన మూనుచు మనన మొనరించుచు బయలిఁ బట్టుచు హాయిలు నెట్టుచు మేడలు, వాడలు, భవనంబులు, వనంబులు, పల్లెలు, పట్టణంబులు, ఝురులు, గిరులు, నదీనదవాపీకూప తటాకాదులు గడచి,సత్వములకు భయమందక పరమోత్కృష్టసత్వశాలియైహిమవత్పర్వతప్రాంతకాంతారముఁ జొచ్చి తృష్ణి పాన లడఁగ నిర్మలసలిలము లుగ్రోలిధ్యానారూఢుఁడై తిర్యగ్జంతువులభ్రమింప జేయుజడతఁ బొడకట్టు చుండె. అయ్యారే! యట్టి మహాత్మునకు విశ్వవ్యాపకుఁడు విష్ణువు పొడకట్టు టబ్బురమా! శ్రీవిష్ణుసారూప్యము లభించుట వింతయా!

సర్వమయుండును, ఆకాశసంకాశదేహుండును, నగు శ్రీమహావిష్ణు వానారదుని మనోనిగ్రహమునకు మెచ్చి కట్టెదుటఁ బొడకట్టెను. ధైర్య

స్థైర్యముల సర్వావయవములు బంధించి మానసఫ
కమునఁ జిత్రించి తదేకధ్యానమున నేమానవుఁ
డైనను వాఁడే యేమాత్రుఁ దా నశ్లేషించునో యా
మూర్తి పొడకట్టక మానదు. అట్లే శ్రీవిష్ణువు నార
దునకుఁ గానుపించి "నాయనా నీవింకను షట్కర్మలఁ
బాధ్యాంబు చేసి యిట్టే నామీఁద మనసునిలిపి చరిం
చక మైహికముల కించుకయు లోనుగాక యుండిన
చో వారి యొకపుట్టువున బ్రహ్మవిజ్ఞానమబ్బియుండ వ
గుట శుద్ధసాత్త్వికాగ్రణుఁడవై బ్రహ్మపుత్రుఁడవై
మన్ముక్తుఁడవై వెలయుదు" వనెను.

ఆహా! ద్విజన్మపదార్థమిదియకదా! పుట్టు
వుమొదలు కొన్నినాండ్లు అజ్ఞుఁడై యైహికబంధము
లవల్లలాడుచు వెనుక నోగుబాగుల నిహపరముల నే
ర్చి విజ్ఞానసంపన్నత వహించుటయే ద్విజన్మము. అ
ట్టివారే ద్విజులు: కావుననే తొలుత శూద్రత్వ
మెల్లరకు నాపాదింపఁ బడినది. దాని బ్రహ్మజ్ఞాన

శించి మదము నణంచి మత్సరము నుడిగించి స్థిరుఁ ఞంచి శ్రీమన్నారాయణుని యనంతనామములు పఠించుచు నిర్మలాంతఃకరణమున విషయవిరక్తుఁడై యవసాన సమయమునఁ దత్ప్రాకృతదేహంబు విడిచి శ్రీవిష్ణువునం దైక్యమై పునస్సృష్టిసమయంబున శ్రీవిష్ణునాభికమలమున నుద్భవించిన బ్రహ్మ నుండి వెలువడి నారాయణనామకథాకీర్తనపరుం డయి ముల్లోకసంచారుం డయి యుండె.

నారదుఁడు సంగీతమున సాటి లేనివాఁడు సప్తస్వరముల శ్రీమన్నారాయణుఁ డడఁగి యుండుట నాన ప్తస్వరము లాధారంబుగా మహతి యను వేయి తంత్రులు గలవీణఁ జేకొని లయనాట్యవిలాసంబుల నాతనిలోనే లయమయి పరిపూర్ణతేజుం డయి విలసిలు చుండె.

నారదుఁడు అఖండితబ్రహ్మచారి; పూర్ణమనస్సంన్యాసి; త్రిలోకసంచారి.

నారదుఁడు ఆమహామూర్తి సందర్శనమునను వానియొక్క యాదేశమునను నూతనతేజోద్దీపనుఁడై బ్రహ్మతేజోరాశియై బ్రహ్మమానసపుత్రుఁడై అనంతుఁడై యవికల్పుఁడై యవిచ్ఛిన్నుఁడై యానందమయుండై శ్రీవిష్ణునామనమ్మృతమనఃపరిపూర్ణుఁడై నిరంతరదిగంతవిశ్రాంతపరిపూర్ణయశోవిలాసుఁడై మృతజీవుఁడై నెగడెఁ. గావుననే యామహానుభావుని బ్రాహ్మణునిగను చిరజీవిగను సర్వసంచారిగను సాత్త్వికనారదాభిఖ్యునిగను బరిగణించిరి.

కాని జ్ఞానలోకమున నారదదృష్టి లేమి కథాచమత్కృతికిఁ గొండెమాన్యునిఁ గొండెగానిఁగను గడుపుబ్బుతనము గలవానిఁగను మార్చిరి. ఇది యెంతయుఁ దప్పు. దేశోపకారియు దేశక్షేమాభిలాషియు సర్వజనోద్ధారకుఁడును, సర్వాపన్నులకాపాడుదుఁడును నగునారదమహర్షి నారదదృష్టియై నచ్చె

